# మహా శివరాత్రినాడు చేయవలసిన విధులు

సంక్రాంతి పండుగ తరువాత వచ్చే పండుగలలో ముఖ్యమైనది, **మహాశివరాత్రి!** ఇది, దేశమంతా జరుపుకుంటారు

**మహాశివరాత్రి** — శివునకు ప్రధానమైన పర్వదినం! దీనిలోని విశేష మేమంటే అన్ని పండుగలు పగటిపూట జరుపుకుంటే ఈ పండుగలో ప్రధానభాగం **రాత్రిపూట జరుపుకుంటాము!** ఈ పండుగకు ముఖ్యమైన విధులు 1) పగలంతా ఉపవాసం చేయడం, 2) రాత్రి జాగారం చేయడమూను! ఈ ఉపవాసం జాగారంతోపాటు **బిల్వదళాలతో** శివుని పూజించటము, **"శివాభి షేకం"** (రుద్రాభిషేకం) చేయటం ముఖ్యమైనవి రాత్రిపూట సాధన జరుప వలసిన ప్రధానమైన పండుగ కాబట్టి దీనికి 'శివ-రాత్రి' (శివునియొక్క రాత్రి) అని పేరువచ్చింది

## శివరాత్రి నిర్ణయం

ఈ పండుగ ఎప్పుడు చేసుకోవాలి? అనే విషయంలో ధర్మసింధువు వంటి శాస్త్రగ్రంథాలు కొన్ని విశేషాలను తెలుపుతున్నాయి!

మాఘమాసంలో వచ్చే బహుళపక్ష చతుర్దశినాడు — అనగా అమావాస్యకు ముందు వచ్చే కృష్ణ చతుర్దశినాడే 'శివరాత్రి'గా జరుపవలెనని శాస్త్రనిర్ణయము

## మాస-శివరాత్రి :

ప్రతినెలలోనూ కూడా బహుళ పక్షంలో అనగా, అమావాస్యముందు వచ్చే చతుర్దశిరోజు శివునికి ప్రీతి అయిన కాలంగా భావించే 'మాస-శివరాత్రి' అన్నపేరుతో శివపూజలు చేస్తాము ఇది ప్రతినెలా వచ్చే పర్వదినం కాబట్టి దానికి 'మాస-శివరాత్రి' అని పేరు! అలాంటి పన్నెండునెలల్లో, వచ్చే మాసశివరాత్రులలోకీ — ప్రధానమయిన పర్వదినం కాబట్టి, దీనికి 'మహా-శివరాత్రి' అని పేరు

## శివరాత్రి – మహాపర్వకాలం

శివరాత్రి పర్వకాల నిర్ణయం విషయంలో ఒక ముఖ్యమైన శాస్త్ర నియమాన్ని ధర్మశాస్త్రగ్రంథాలు తెలిపివున్నాయి అదేమిటంటే ఆరోజు బహుళ చతుర్దశీ తిథి అర్ధరాత్రివరకూ — వుండాలి! అర్ధరాత్రి కనుక బహుళ చతుర్దశి లేని పక్షంలో అంటే అమావాస్య గనక ముందే ప్రవేశించినట్లయితే — అంతకు ముందురోజునే శివరాత్రి పండుగ జరపాలి! ఇలా రెండురోజుల్లో ఏరోజు చతుర్దశి వుందో ఆదినమే "మహాశివరాత్రి"గా పరిగణించాలి

దీనికితోడు ఈ మహాశివరాత్రి గనుక మంగళవారంనాడు వస్తే అది,

మరీ అతిప్రశస్తం! శివరాత్రినాడు పగలు ఉపవాసం చేయాలి రాత్రి జాగరణ రెండూ చేయాలి!

## శివరాత్రినాడు చేయవలసిన శాస్త్రవిధులు

స్నాన సంధ్యాదికములు పూర్తిచేసుకుని నిత్యపూజ. జపం. అయిన తరువాత, మహా-సంకల్పం చెప్పి

'శివరాత్రి వ్రతం కరిష్యే!
తన్మహాఫలం నిర్విఘ్నమస్తు
త్వత్. ప్రసాదాత్ జగత్పతే'

అని మహాదేవుడయిన శివుని మనసా భావించి ఆత్మతో ధ్యానించి సంకల్పంచేసి చతుర్దశి తిథి అంతా నిరాహారుడై వుండి ఉపవాసం చేయాలి ఉపదేశం వున్నవారు "శివపంచాక్షరీ" మంత్రమును అంగన్యాస, కరన్యాసము లతో అనుసంధించి సహస్రం (వెయ్యి)కి తక్కువలేకుండా జపించాలి! వెయ్యికిపైన ఎంతైనా శివపంచాక్షరీ మంత్రం జపించవచ్చును

"ఓం నమశ్శివాయ"

అను మంత్రమునే శివపంచాక్షరీ మంత్రమంటారు ఈ మంత్రం యధాశక్తి జపించిన తర్వాత మారేడు దళం గ్రహించి పాలతో కలిపిన తీర్థంతో శివలింగంపై తర్పణంగా విడిచిపెట్టాలి ఇలాగ దినమంతా శివపూజతోనూ ధ్యానంతోనూ శక్తి కలిగినవారు రుద్రాభిషేకంతోనూ, గడపవలెను ఈ రుద్రాభి షేకము శక్తి కలిగినవారు మహాన్యాస పూర్వకముగాకాని. లేక లఘున్యాస పూర్వకంగాకాని చేయవచ్చు

శివలింగము స్పటికంతో చేసినదిగాని లేదా నర్మదానదిలో దొరికిన బాణంతోచేసిన 'బాణలింగం' గాని లేదా మట్టితోచేసిన పార్థివ-లింగము కాని

ఏర్పాటుచేసి దానిపై మహాదేవుడయిన శివుని ధ్యాన ఆవాహనాది, షోడశోప చారములు చేసి మహారుద్రముతో పదకొండుసార్లు అభిషేకము చేయవలెను

గంగాజలంతోకాని, కేవలం అభిమంత్రించిన నీళ్ళతోగాని, రుద్రాభిషేకము చేయవచ్చును

## రుద్రాభిషేక విధానం

ఈ రుద్రాభిషేకం చేయునపుడు లింగముపై మారేడు దళములుంచి ఒక్కొక్క కలశంలోని నీళ్ళతో కలశపూజ చేసి ప్రతి కలశమునందూ శివ పంచాక్షరితో అభిమంత్రించి ఆవిధముగా 108-కలశములూ మంత్రపూరితము చేసి సిద్ధముచేసుకొని — అప్పుడు రుద్రాభిషేకము ప్రారంభించాలి

అభిషేకము పూర్తి అయ్యేసరికి కలశములలో అభిమంత్రించిన తీర్థము సరిగ్గా సరిపోవునట్లు అనగా — తర్వాత నీళ్ల తక్కువైతే కలుపుకోకుండా చేయవలెను అట్లు చేసిన రుద్రాభిషేక ఫలితము పూర్తిగా కలుగును

## రుద్రాభిషేకంలో దోషాలు

అట్లుకాక చాలామంది బిందెలతో పంపునీటినిగాని, నూతి నీటినిగాని తెచ్చి, అట్లే అభిషేకంగా రుద్రమంత్రం చెపుతూ బిందెలతో నీళ్ళు శివ లింగంపై పోయుటయేకదా? అనుకుంటారు!

అట్లయితే తడవ తడవకీ బిందె ఎత్తి, పోయుట శ్రమగదా? ఒకేసారి శివలింగమునే పంపుకిందపెట్టి ఆనీరు పడుతున్నంతసేపూ మహారుద్రమును ఏల చదువరాదు? పని త్వరగా జరుగునుకదా?" — అనేప్రశ్నను మాయింటికి రుద్రాభిషేకము చేయడానికి వచ్చిన పూజారిగారిని నేను ఒకసారి, అడిగితిని దానికి ఆయన సరియైన సమాధానము చెప్పలేక 'అట్లు పంపుకిందపెట్టిన

అపచారము! బిందెలతోనే విడివిడిగా అభిషేకము చేయాలి' అన్నారు కాని నేను ఊరుకొనలేదు 'ఇందులో భేదమేమి? శాస్త్ర నిషిద్ధము ఏమైనా కలదా?' అంటిని 'అట్లేమీ లేదుకాని కలశములతోనే అభిషేకము చేయుట ఆచారము' అనెను

అప్పుడు నేనిట్లంటిని పంపునీటిని కాని, నూతినీటిని కాని, ఏనీరైననూ సరే, తెచ్చినది తెచ్చినట్లు అభిషేకము చేయరాదు! ఇది శాస్త్రవిరుద్ధము!! ఎందుకనగా నీటియందు విషము ఉండును, అని వేదప్రమాణము! ఈ విషము అంట్లేవుంచి అభిషేకం చేసిన నిష్ఫలము కాబట్టి కలశములలో నింపిన జలమును ముందుగా 'నిర్విషము' చేయవలెను అట్లు నిర్విషము చేయుటకు 'తార్క్ష్యముద్ర' లేక గరుడముద్రను చేతితోపట్టి నీటిపైఉంచి, విష హర మంత్రములతో లేక 'మృత్యుంజయ' బీజాక్షరములతో అభిమంత్రించి ఆపైన 'అమృతముద్ర'ను పట్టి 'అమృత బీజాక్షరము' నుచ్చరించి, జలమును "అమృతీకరణము" చేయవలెను

అట్లు అమృతీకరణము చేయబడిన జలమునే శివాభిషేకము చేయుటకు — పైవిధముగా నిర్విషీకరణము చేయలేదు గనుక — వీలు పడదు! ఇదియే శాస్త్ర విహితమైనది, చాలామంచిది ఇది రుద్రాభిషేకము యావజ్జీవం చేయుచుండువారికి కూడా తెలియదు! అందువల్ల రుద్రాభిషేక ఫలము వీరికి కలుగుటలేదు

## రుద్రాభిషేక ఫలము

పై చెప్పినవిధంగా రుద్రాభిషేకము చేయువారి హస్తము అమృతీ కరణము పొందును అతడు ముట్టుకున్న ప్రతివస్తువునకూ అమృతత్వసిద్ధి కలిగించును

మృత్యువును సహితము జయించవచ్చును ఇట్టి రహస్యములు యోగియైన సద్గురువు నుండియే, తెలియవలెను

## నమక–చమకములు

ఈ రుద్రాభిషేకమునకు 'నమక-చమకము' లతోనే సామాన్యముగా అభిషేకము చేయుదురు. అట్లుగాక 'మన్యుసూక్తం' తోనూ, మృత్యుంజయ మంత్రసహితంగా గాని పాశుపత బీజాక్షరసహితంగా కాని, రుద్రాభిషేకము చేయవచ్చును దీనికి **పాశుపత, మన్యుసూక్త మంత్రాలు ఉపదేశంగా పొందాలి!**

వీని, అంగన్యాస కరన్యాసములు ధ్యాన, అవాహనములు మూల మంత్రములు తెలియవలెను దీనికి **నల్లజీడిగింజల చెట్టకర్రలు సమిధలుగా**

శివునియొక్క వివిధ మూర్తులయిన అఘోర, తత్పురుష మన్యు, శివ మూర్తులలో ఏదైనా మూర్తిని ముఖ్యముగా ఆధారం చేసుకుని రుద్రాభిషేకం చేయవచ్చు. ఒక్కొక్క దాని ఫలితం వేరు వేరుగా ఉంటుంది

పైవిధంగా రుద్రాభిషేకంచేసి భస్మముతొ త్రిపుండ్రములు అడ్డముగా శివలింగమున నుంచవలెను। తర్వాత చందనంతోనూ, ఆపైన కుంకుమతోనూ గుండ్రంగా బొట్టునుంచవలెను

ఆనాడు సాయంకాలం నల్ల నువ్వుల పిండితో నలుగు పెట్టుకొని స్నానం చేసి విభూతి త్రిపుండ్రములు, రుద్రాక్షలు ధరించి తూర్పుముఖంగా కూర్చుని సంకల్పంచేసి ఒక్కొక్క జామునకు విడివిడిగా పూజ చేయవలెను

అట్లు నాలుగు జాములయందును నాలుగుసార్లు శివపూజచేసి నాలుగు సార్లు నైవేద్యం, కర్పూరహారతి ఇవ్వవలెను

ఈ శివపూజకు శివపంచాక్షరి మంత్రము, న్యాసము, జపము చేసి అనుసంధించి పూజించవలెను